శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీరామానుజవిలాసము

# శ్రీరామాయణసారసంగ్రహము.

ఇది,

ధనాల. దేవరాజులునాయనివారిచేఁ

జేయఁబడి,


చెన్నపురి,

కలానిధిముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రుధిరోద్గారి సం॥ పంగుని నెల.




దీనివెల 3 అణాలు.

శ్రీమతేరామానుజాయనమః
శ్రీమద్వరవరమునయేనమః
అస్మద్గురుభ్యోన్నమః

---

## శ్రీరామానుజవిలాసము.—యక్షగానము.

---

ద్విపద.

శ్రీవెలయంగనాశ్రితపారిజాతు- శ్రీవేంకటార్య
ని శ్రీశైలవంశ*జలనిధిసోమునస్మద్గురుచంద్రుఁ - బలు
దెఱంగులఁగడుభక్తిఁబూజింతుఁ*బరమగురునిఁగొల్తుఁ
ఁబరఁగసర్వగురు- వగులఁదలఁతుయతివరునిభజింతు*
శ్రీమంతుఁబూర్ణార్యుఁజెలఁగిసేవింతు-యామునాచా
ర్యులనతిభక్తిఁగొలుతు * శ్రీరామమిశ్రునిజేరిభజిం
తు-నారసిపుండరీకాక్షుఁదలంతు * శ్రీనాథమునిఁగొ
ల్తుశ్రీశఠవైరి-మానకభజియింతుమదినిసేనేశుఁ*దడ
యకఁగొలుతుశ్రీతరుణిభజింతుఁ-గడుభక్తిశ్రీధరుఁగ
రముసేవింతు॥

సీ॥ శేషరూపంబున శ్రీశునిబాన్పయిలక్ష్మణుఁడయి

యూర్మిళను వరించి । బలభద్రమూర్తివై పరగ రేవతిఁ
గూడి భాష్యకారుండవై భక్తి నిన్నుఁ । గొల్చు యువతిన
న్నుఁ గూర్మితోడ వరించి వరయోగిచంద్రుఁడై నరకము
నను । బడఁగోరరే నిశ్రీభాష్యకారుని గొల్వుఁడని నరుల
కుఁ దెల్పితనరఁ దిరుమ॥ గీ॥ లాన్వయాంబుధిచంద్రుఁడై
యనుదినంబు । సమరసద్ధంకితిరు వేంకటార్యనామ । ము
నను జెలఁగుమంబుధజనవినుతభక్తిఁ । బూనిమది నిన్నుఁ
గొలుతు రామానుజార్య॥

ఏకతాళము.

కూరకులేశునిఁ గొంగుపిరాట్టిని । శ్రీరంగామృతుఁ
జేరి భజింతున్ ॥౧. వడుగనంబియతివరు నెంబారును । వ
డయకనామవిఁదద్దభజింతున్ ॥ ౨. దాశరథివితలధరణీ
నాయకు । దేశికభట్టరుఁ దెలివిభజింతున్ ॥౩. పేరరుళా
ళంబెరుమానారును । శ్రీరామప్రియుఁ జెలఁగి భజిం
తున్ ॥౪. అందముగ ననంతాళ్వాను గో । విందజీ
యరును వెలయ భజింతున్ ॥౫. వైష్ణవనంబిని వేంకటగి
రిధవు । వైష్ణవముఖ్యుల వరుస భజింతున్ ॥౬.

వ॥ ఇట్లుగురుపరంపరను బరిజనసహితంబుగ నా యిష్టదైవంబగు శ్రీ రామానుజునిభజించి.

జంపె.

అవనికినిహరియాజ్ఞనమరశిరమునఁదాల్చి। యవత రించినయట్టియతిరాజునకును॥ ౧. మునినాథవంద్యున కుమురవైరిగురునకును । ననఘతిలకుండైనయతిరాజు నకును॥ ౨. పరమతగజంబులకుఁబటుసింహమైనట్టి।హ రిమిత్రుఁడైన శ్రీయతిరాజునకును॥ 3.

వ॥ అంకితంబుగ నాయొర్చంబూనిన శ్రీ.రామానుజవి లాసంబను యక్షగానంబునకుఁగథాక్రమంబెట్టిదనిన.

ద్విపద.

మురవైరితనునిత్యము క్తులుగొల్వఁ- బరమపదము నంచుఁబరగుచుండ * సకలజగన్మాతసద్గుణోపేత- శుకవాహనునితల్లి శుభకల్పవల్లి * యగునిందిరాదేవి యాహరిఁజూచి-తగనిట్టులనియెనుదద్దయుఁ బ్రీతి॥

కురుచజంపె.

కొండజాత్మలుమోక్షమందు।మరియుఁ। గొండజా

త్మలుస్వర్గమంచు॥ ౧. కొందఱాత్మలునరకమంచు । స్థితిని। జెందుటకునాథయేమంచు॥ ౨. నీకుబిడ్డలువారలెల్ల। కానఁ। బ్రాకటంబుగవారినెల్ల॥ ౩. నీవుప్రోవఁగవలసియుండ।నీకు।గోవిందతగునెయిట్లుండ॥ ౪.. పక్షపాతముచేయఁదగునా।నీకు।రక్షకుండనెడుపేరగునా॥ ౫.

వ ॥ ఇట్లడిగినక్షీరసాగరపుత్రిం జూచి శార్ఙ్గపాణియేమనుచున్నాఁడు॥

అర్థచంద్రికలు.

మనుజులఁబ్రోవఁగమహిఁబుట్టితిని*ననుఁజూడఁగనయనములిచ్చితిని*నాకథవినఁగర్ణములిచ్చితిని * మఱినన్నెఱుఁగఁగమతినిచ్చితిని * ననువలఁగొనఁజరణములిచ్చితిని* ఇన్నియునిచ్చియునేవద్యోఁచుదిరా * వినునన్నుఁగొల్వకవేవిధములను*వలితులగుచుఁబాపంబులఁజేసి*నరకముఁజేరెదరయమదిని॥*

ద్విపద.

ఏనేమిచేయుమనిందీవరాక్షి-మానవుల్గలిరాజుమాయనుదగిలి * పలుదెఱంగులనన్నుఁబ్రార్థింపలేక-వల

నొప్పునన్యదేవతలఁబూజించి* మదమత్సరంబులమా
నంగలేక-సదయులై మెలఁగెదరంబుజాతాక్షి*కావున
నిదియెల్లకలినాయకుండు- కావించుచుండెడుకపటకా
ర్యంబు*వినుమనిపల్కె- నవెఱచి శ్రీదేవి-తనపతివీక్షించి
తగనిట్టులనియె*దేవాధిదేవసందీప్తప్రభావ-భావించి
నావిన్నపంబాలకింపు* సకలలోకములకుస్వామివైనీ
వు సకలజీవులయందుసంచరించెదవు* మహినిసర్వం
విష్ణుమయమనుమాట - మహితశాస్త్రంబులమరఁజె
ప్పుచుండ*ఘనమైననీమాయకాకయున్నియును-గనుఁ
గొనవేఱొండుకలదెమానవులఁ* గరమర్థి నీపాదకమ
లములొగ్గొలిచి- ధరధన్యులగునట్లుదయఁజేయకిట్లు* కా
వింపధర్మమె కమలాయతాక్ష - భావింపనపకీర్తిపా
లైతివీవు॥

వ॥ఇట్లునిఖిలచేతనోజ్జీవనార్థము శ్రీదేవితనభర్తం
బ్రార్థింపనతండు, శ్లో॥ నివాసశయ్యాసనపాదుకాం
శుకోపధానవర్షాతపవారణాదిభిః। శరీరభేదైస్తవశేష
తాంగతైర్యథోచితం శేషఇతీర్యతేజనైః॥ ఇత్యాదిప్ర

మాణంబులచే నిత్యసూరివర్గ ప్రధానుండగు నాదిశే షుంజూచినీవవనికవతరించియికార్యంబు నెఱవేర్పు మనినన తండేమనుచున్నాఁడు.

సీ॥అసుర క్తినిట్టికార్యంబుఁగావింపంగ వనజాక్షు నే నెంతవాఁడనరయ । వనజాసనాదిదేవతలకునైనను దీరఁగనీమాయ తెలియరాదు । ధరనట్టినీమాయఁదగిలి వర్తించెడునరులను బ్రోవంగనాకుఁదరమె । యనిఫణి తిలకుండుతనరఁబల్కినమాటవినివానివీక్షించి విష్ణుఁడ నియె॥ గీ॥ నలినినీవుభయవిభూతినాయకత్వ । మొసఁగి తినినిన్నుఁగొల్వకనోనరసన్నుఁ । గొల్చుమానవులకు నే నుగూర్మి మోక్ష । మును మోక్ష మొసంగుటకీవె కర్త॥

వ॥అనిపల్కిన శ్రీశునానతిశిరంబునఁదాల్చి యదు గిరిమాహాత్మ్యంబున, కలౌకశ్చిద్భవిష్యతి।అనువాక్యం బును, పొలిగపొలిగ।అనుతిరువాయ్మొళియుసత్యంబు గ, శ్లో॥ అనంతసరసీతీరేరమ్యేభూతపురీవరే। కేశవోభ గవాన్ విష్ణుఃప్రసన్నోభూన్మహామునేః॥ అనిపురాణ ప్రసిద్ధంబగు శ్రీపెరుంబూధూరసర్వక్రతుసోమయా

జీయను నామాంతరముకలిగిన శ్రీకేశవాచార్యులకు భూమిపిరాట్టియందు, శ్లో॥ పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయచ। శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః॥ అనునట్లాసూరివంశపయఃపారావారరాకాసుధాకరుండై యవతరించిన.

అర్థచంద్రికలు.

పుష్పవర్షము భువిపైఁ గురిసెఁ *ఎంతయునిందిరసంతోషించెఁ *జమునకు వామభుజంబపుడదరెఁ * యమపురిరక్తంబప్పుడుకురిసెఁ * సురదుందుభులును సొరదిని మ్రోసెఁ *సమతతిమిరములుగొబ్బునఁదొలఁగెఁ॥

వ॥ ఇట్లవతరించినపదునొకొండవదినంబున.

ద్విపద.

చుట్టంబులటఁగూడిసొగసైనముద్దు - పట్టికేనామంబుఁబరఁగనీవచ్చు * ననుచుఁజింతింపంగనతని *మాతులుఁడు - వినుఁడంచుఁబలికెనువిశ్వంబులోనఁ * గొనియాడఁదగుభానుకులమునఁబుట్టి - ఘనుఁడగుదశరథ

---

*వీరితిరునామము, పెరియతిరుమలనంబి.

త్స్మానాథవరుని*గూర్మిపుత్రునిరఘుకులముఖ్యా రాముఁ
గూర్మితమ్ముండైనకులశేఖరునకు*నారయ శ్రీలక్ష్మణా
ఖ్యధీరునకుఁ- బేరుకలదిళయపెరుమాళనంగ* నామ
హానీయుండెయచ్యుతునాజ్ఞ-నీమహాత్ముండగుసీకేశవా
ర్యు*తనయుఁడైపుట్టెనుధాత్రీతలమున-వినుఁడట్లుకా
వున వేడుకనిప్పు* డమరంగ శ్రీయిళయాళ్వారనంగ-
మిము సంతసిలఁజేయు మేటిపాపనికిఁ* బేరిడఁదగునని
పేర్మిఁబల్కంగ- శ్రీరంజిలఁగ వారు చేసిరారీతి॥

వ॥ ఇట్లు నామకరణంబైన నానాట వర్ధిల్లుఁగుమా
రుని బాలక్రీడ లెట్టివనిన. జంపె.

కరమునమ్మయనుచున కారవాచ్యుని శ్రీశు। నరయుఁ
డనుచును బ్రజలకందఱకుఁ దెలుపున్॥౧. దంతంబులను
రెంటిఁదనరంగఁజూపుచో। నెంతయును ద్వయమరయు
ఁడిలనంచుఁ దెలుపున్॥౨. చను బాలుఁద్రాగుచో జను
లార నైకుంఠ। ముని జేరిననులక్ష్మీతనరంగమీకున్॥౩.
నెమ్మిఁజను బాలిచ్చునమ్మఁడనుచుం దెల్పు। నిమ్మహాత్ము
నిఁబోగడనేరికిఁదరంబు॥౪.

వ॥ పిదపయుక్తకాలంబున నాపాపనికిఁ గేశవాచార్యు
లుచౌలోపనైన వేదాధ్యయన పాణిగ్రహణంబులు చే
యించె నంత నిళయాళ్వారు వేదాంతార్థంబుల నెఱుం
గుటకై కాంచీపురియందు యాదవప్రకాశుండను నేక
దండసన్యాసి కడకరుగ మధురమంగళగ్రామ నివాసి
యు భూమిపిరాట్టిచెల్లెలి కుమారుండును నగు గోవింద
భట్టరీవృత్తాంతంబు నెఱింగి తానునచటికే తెంచి తన
యన్నను గూడి వేదాంతార్థంబుల వినుచుండ నొక్క
నాఁడిళయాళ్వారు.

ద్విపద.

తనగురునకుఁ దానుదలయంటుచుండఁ- దనశిష్యుల
కును నాతండు కప్యాస*మునకుఁదప్పగు నర్థమును జెప్పఁ
గాను- విని యిళయాళ్వారు వడి చెంగ నీళ్లఁ* గరమున
య్యవి యగ్నికణముల యట్లు - గురుఁదొడపైఁ బడఁగొ
బ్బున నాతఁ*డేల దుఃఖించెద విపుడని యడుగ- నాలకు
ణాకారుఁడని యెనీలాగు* నీవు చెప్పిన యర్థమీ వాక్యము
నకు- నేవారలైన నీయిలసరి యనరు* నావిని యాతండు

నాకడనిట్టి-శ్రీవారిజాక్షుఁడౌ శ్రీహరిభక్తుఁ* జేర్చిన
నెక్లైనఁజెలుచునామతముఁ - గార్చిచ్చువనమాట్లుక
పటంబుఁబన్ని*వీనిఁజంపుమనని విప్రుండుతలఁచి-యేను
గాశికిఁబోవనిపుడుతలఁచితి*ననుగూడిమీరుతనరరండు
వేగ- ననవిని శ్రీయిళయాళ్వారు మొదలు* గాఁగలశి
ష్యులుకడు వేడ్కతోడ - నాగురునింగూడి యటఁజను
చుండ॥

వ॥ వింధ్యాటవినిగోవిందభట్టుచే మర్మంబు నెఱిం
గిగురువుదవ్వున కేగువఱకుమఱగియుండి తన్నుంగాం
చీపురింజేర్చుటకై విల్లునమ్ములుదాల్చి పెరుందేవింగూ
డియెఱుకవేషంబునవచ్చిన శ్రీవరదరాజుంగూడినడు
చుచుండ.

సీ॥ అరుఁగఁడ స్త్రాత్రికినరిగినవారలు నిద్రించిరొక
చోట నెమ్మదిగను। నప్పుడాయెఱుకిళయాళ్వారునుంద
గ సెవిలిమేడునఁజేర్చె శీఘ్రముగను। మఱుచటిదినము
శమహానీయునకునిత్యకర్మంబులనుదీర్పఁగరము వేడ్క।
సాలతీర్థముఁజూపిసర్వేశువరదునిమందిరంబును జూపి

వ॥ అని గెనతఁడు॥ గీ॥ వెనుక శ్రీయిళయాళ్వారు విష్ణుఁజేరి। చేసెఁదిరుమంజనంబును జెన్నుమీర।నిత్యకైంకర్యముల వేడ్క నెరవుచు చట।గడుపుచుండెను దినములఁగరము వేడ్క॥

సీ॥యాదవుఁడటనిళయాళ్వారు రామికిఁజింతింపుచును గాశిఁజేరియపుడు। స్నానము చేసెను జాగు చేయక గంగ శిష్యయుతంబుగఁ జెన్నుమీర। వెట్టన గోపిఁదభట్టను చే నొకలింగంబుదగిలినలీలనపుడు । నలినినుల్లంగయినయినార నెడనానమిడి యాదవుఁడు కాంచి కేగి కేళ॥ గీ॥ వార్యసుతుఁజేరఁజేరి యోయయ్యనాచ।చెంతఁజమవును వేదముల్ చెన్నుమీర । ననుచుఁ బ్రార్థింప నారీతినతఁడు చేసి। శ్రీశుఁగొల్చుచునుండెను శ్రీదలిర్ప॥

వ॥పిదప.　　ద్విపద.

మహికిభూషణమగు మధుర మంగళము - నహిపతియంశజునను జుండు చేరి*తన చేతఁదగిలి యాధర నొప్పులింగ-మున చటఁదగఁ జేర్చి మోదంబుతోడఁ* గాళహస్తికి నేగి కర మొప్పనచటఁ - గాళహస్తీశుని గౌరీశురు

ద్రు॥*మురవైరిమనుమనిమ్ముకొంటివేడ్క--ధరఁగొల్చు
చుండె శ్రీభవునుదిమఱచి॥

వ॥ తదనంతరంబ.

త్రిపుట.

మూఁగయొక్కఁడు క్షీరసాగరమునకు నేగిరమేశుఁ
బొడగని। వేగమోక్షంబొసఁగునాకని వెలయ వేడఁగ ౧.
హరియునిట్లనెఁగేశవార్యుల వరకుమారునకే నొసంగి
తిఁ। బరఁగనుభయవిభూతి నాథత్వంబువినుము॥ ౨. అ
తఁడు కాంచిని శ్రుతులఁ జమువుచు యాదవునికడనున్న
వాఁడు। వతని వేఁడినఁగల్గు మోక్షంబరుగుమటంచుఁ॥ ౩.
అనుచు హరియనమూఁగయును గాంచిని ముదంబునఁ జేరి
కేశవ। తనయు వేఁడిననొసఁగెనతఁడు తనికిముక్తిఁ॥ ౪.

వ॥ అంత. జంపె.

రాజాత్మజను బ్రహ్మరక్షస్ససోకంగ। రాజు యాద
వు బ్రహ్మరక్షస్సుఁ దోలఁగ॥ ౧. కరము వేఁడంగ నా గు
రుఁడుఁ జెనరక్షస్సు । నరుగుమీవని పల్కెఁ బరఁగ నదిప
ల్కెఁ॥ ౨. నీపూర్వజన్మంబు నాపూర్వజన్మంబు। నీపుడమి

నెఱుఁగుమ వెయిూవుపాఱుండ॥౩. నీవొక్కయుడుము
మును శ్రీవైష్ణవోచ్ఛిష్ట। మీవసుధభక్షించియిూజన్మము
నను॥౪. విప్రుఁడుగఁబుట్టితివి వెలయమును జన్మమున। వి
ప్రుండ నేనోరివి ప్రుఁడాఽనుము॥౫. యాగంబుఁ జేయం
క్రియాలోపమటఁగల్గ। నోగురుఁడయిూరూపు వేగఁగ్గై
కొంటిఁ॥౬. కాన నే వెఱవహరియానసీయాజ్ఞకును।
నా నాథుఁడనువిప్రనాథుఁడై నట్టి॥౭. కేశవార్యసుతుఁం
డుకృపతోడ నే తెంచి। నాతలనుదనచరణమునిడినఁ
బోమఁ॥౮. అనుచుఁ గోపంబునను దనరఁబల్కనమా
ట। విని కేశవాత్మజుని వేఁడెనా రాజు॥౯.

కురుచజంపె.

కేశవాత్మభవుఁడేతెంచి। యపుడు। కృపనురతుస్స
వీక్షించి॥౧. తనకాలుదానితలనుంచి। మిగులఁ। దనరు
మోదమ్మునను మించి॥౨. నవ్వుచు సురతుస్సు లేపి। తా
ను। దవ్వు నను జెట్టొకటిఁ జూపి॥౩. ఆచెట్టు నేలపైఁ ద్రో
సి। యరుగు। మీచంద్రబింబాస్యఁబాసి॥ ౪. అనుచునా
జ్ఞాపింపఁగాను। రతు। సునుబోయెశీఘ్రంబుగాను॥ ౫.

వ॥ పిదపఁగొన్నిదినంబులకుశ్రీరంగక్షేత్రనివాసియగుశ్రీయాళవందారిళయాళ్వారులవృత్తాంతంబంతయునెఱిఁగివారింజూచువేడ్కఁ గాంచీపురికేతెంచి శ్రీవరదుని సేవించి మరలునప్పుడు కచ్చిక్కువాయ్త్తాన్ తిరుమంటపంబునకుఁజెంత.

అర్థచంద్రికలు.

యాదవనాముఁడు మోదముతోడన్ *శిష్యులతోవచ్చెనుసన్నిధికిన్ * ఆళవందారతికుతుకతతోన్ * కాంచీపూర్ణులఁగనియిట్లనియెన్ * ఇళయాళ్వారెవరిందఱిలోనన్ *అనవినియాతండనెనిట్లపుడే॥

వ॥ దీర్ఘహస్తపాదుండు నెఱ్ఱని దేహకాంతిగలవాఁడునగుఁబురుషుండేయిళయాళ్వారనవినియస్మత్పితామహుండగునాథమునులకునమ్మాళ్వారులానతిచ్చినభవిష్యదాచార్యచిహ్నంబులీతనియెడంగంటిననుచునాతనిశ్రీవైష్ణవమతోద్ధారకుంజేయునట్లుశ్రీవరదునింబ్రార్థించివీరాముదల్వులనిపల్కి యామునార్యులుశ్రీరంగంబునకరిగిరంతంగొన్నిదినంబులుగడచినపిదప.

త్రిపుట.

ఆర్యుఁడగు శ్రీయామునార్యుం డార్యతిలకుండైన శ్రీపూ।ర్ణార్యుఁగనియిట్లనియె నో పూర్ణార్యపినుము॥ పను దేహవ్యాధిఁ జెందితిని పుడెశ్రీ కేశవతనూజుని।మా ను గానీవరిగితోడ్కొనిమఁ బలిరమ్ము॥౨. అనిన నాతఁడు కాంచికప్పూడెయరిగియచ్చటసాలతీర్థం। బునకుఁ జెంత నుస్తోత్రరత్నముఁదనరఁజదువన్॥౩. ఒనరభూమిపి రాట్టినందనుఁడుఁల్లమునను ప్పొంగియచటికిఁ। జనియపుడు పూర్ణార్యునకు మ్రొక్కె నుముదమునన్॥ ౪.

వ॥ మ్రొక్కి యతనితో నేమనుచున్నాఁడు.

జంపె.

అనఘాత్మమీరెవ్వరయ్యాయీ గ్రంథంబుఁ। దనరఁ జేసినయట్టిధన్యుఁడేవాఁడు॥౧. నాపుడు పెరియనంబిన లినినిట్లనిపల్కె। దేవనిన్ జూడనే తెంచితిని నేను॥౨. పెరియనంబియనంగఁబృథివిలోపలనన్ను। నరులుపిలుతు రురంగపురినినివసింతున్॥౩. అరయునీగ్రంథంబుయామునాచార్యుండు।విరచించెఁదన నేర్పువిధమొల్లఁ దెలి

యున్॥ ౪. అనిచెప్ప శ్రీయామునాచార్యుఁడాఁ జూడంగ। వచనమునను గోరి సమ్మదవిత్తుఁ డగుచున్॥ ౫. పెరియనంబిని వెంటఁబెట్టుకొని యేతెంచి। తిరుకచ్చినంబి కాతెఱఁగెల్లఁ జెప్పి॥ ౬. అతని యనుమతిఁ జెందియప్పుడు కేశవసుతుఁడు। హితభక్తిఁ దన తల్లి కెఱుఁగంగఁ జెప్పి॥ ౭. ఆతల్లి పసుపంగనప్పుడే తాఁగదిలి। ప్రీతితోఁ బెరియనంబినిదోడుకొనుచున్॥ ౮. వరదరాజును మ్రొక్కి వచ్చి తగఁగావేరి। వరియందు నిలిచి తీర్థములాడుచుండెన్॥ ౯.

ద్విపద.

ఆసమీపంబున హరిదాసులైన - భూసురోత్తములు
గుంపుగఁ గూడియుండ* నదిచూచి వీరిద్దఱు నటకిఁబోయి-
యదరుచు మిక్కిలియక్కటా యామున* నాచార్యుఁడా
యనియాత్మ శోకింప- నేచిన గతిఁ జేయ నేల శ్రీరంగ* ధా
ముందు నామీఁద దయ లేకయిట్టి- లీమహామహునితోని
ష్టవాక్యంబు*లాడిపోయె ననుచు నరుగు దెంచితిని- వా
డక నేనిందు వచ్చిన కార్య* మరయంగ వృథయయ్యె నని
కేశవార్య- వరపుత్రుఁడన నాళవందారు నపుడు* వెర

వెప్పఁదనమూఁడువ్రేళ్లముడ్చుటయు- ధరదానియర్థం బుపగఁడా నెఱింగి॥

వ॥ వ్యాసనూత్రంబునకొక భాష్యంబు రచించుటయు, వ్యాసపరాశరుల నామంబుల నాచార్యపరంపరం జేర్చుటయు, శఠకోపునియెడల నుపకారస్మృతి కలిగి యుండుటయు నను యామునార్యుల మూఁడుచింతల నేఁదీర్చెదననిన వ్రేళ్లెప్పటియటులనగుటయు.

సీ॥ శ్రీరంగనాథుండు శ్రీయామునార్యులఁబరమ పదమునకుఁబనిచెననుచు। నతనిపైఁగోపించియవనిరంగేశుని సేవింపనాగలిశ్రీవరదుఁడె। యనిపల్క శ్రీరంగమును బ్రవేశింపకఁగాంచీపురినిజేరెఁగరముబ్రీతి। నటఁదనమదినున్నయాఱుసంశయములవరదుని కెఱిఁగింప వలయుననుచు॥గీ॥శ్రీతిరుకచ్చినంబినిజేరియతని।కనియెనోదేవనామదినాఱుసంశ।యములుగలిగెనువానినాయచ్యుతునకుఁ। దెలుపుమననాతఁడును బ్రీతిఁదెలిపెహరికి॥

వ॥ అపుడువరదుండు కాంచీపూర్ణులంజూచి నేను

సాందీపునికడ వేదంబులనభ్యసించిన తెఱంగున నిళయా
ళ్వారును గొందరివలనం గొన్ని యర్థంబుల నెఱుంగు నా
చందంబున నీయాఱుసందియంబుల నాచే నెఱుంగని
నాశ్రయించెనైనం జెప్పెద వినుమని యేమానుచున్నా
ఁడు. శ్లో॥ అహమేవపరంతత్వం దర్శనంభేదమేవచ। ఉ
పాయేషు ప్రపత్తిశ్చ అంతిమస్మృతివర్జనం। దేహావసా
నే మోక్షంచ పూర్ణార్యాశ్రయణంచషట్॥.

త్రిపుట.

అరయఁగా నాకే పరత్వము పరగ భేదమె దర్శనముత
గ। ఖరను పాయము విను ప్రపత్తి యనరులు తనువుఁ॥౧.
వదలునప్పుడు నాదు నామము బల్కవలయు ననంగ నేటి
కి। ముదమునఁ దనువు విడిచినంత నె మోక్షమబ్బుఁ॥౨.
పెరియనంబిని నాశ్రయింపఁగఁ బేర్మిఁ దగునని వరదుఁడ
నఁగాఁ। బరగఁ గాంచీపూర్ణుఁడప్పుడు కరముఁ బ్రీతిఁ॥౩

వ॥ ఇళయాళ్వారుల సందియంబు మాన్పెనంత.

త్రిపుట.

ఒక్కదినమునఁ గేశవాత్మజుఁ డొనరఁ గాంచీపూ

ర్ణుఁగనుఁగొని, మిక్కిలియునిట్లనియెఁదా శ్రీమించునటు
లః॥౧. దేవమాగృహమునకుని వేతెంచి భుజియింపును
ని వేడిన। శ్రీవెలయనాతండునట్టులఁజేతుననియెః॥౨.
తనను గేహంబునకుఁ గేశవ తనయుఁడప్పుడెయరిగి తగ
భో। జనమునంబికిఁబెట్టుమనియెనుదనచుసతితోః॥౩.
ఆయమయుభోజనముసిద్ధంబైనయంతనె తెలిపె భర్త
కు। నాయనఘుఁడునునంబిఁబిల్వఁగనటిగెనపురః॥౪

వ॥అంత॥ జంపె.

వేరుమార్గంబునను వేగనంబియిళయా। ళ్వారుమం
దిరముఁదావరలంగఁజేరెః॥౧. చేరియిళయాళ్వారు
దేవిఁగనియెూయమ్మ। కోరినాకన్నంబుఁగుడువంగఁబె
ట్టు॥౨. దేవరాజునుగొల్వఁబోతలయు నేననిన। నావనిత
యెునరించెనారీతినపుడ॥౩. నంబిభుజియించి శ్రీనాథు
కడకేగనా। కంబుకంఠియును నాథును నెంగిటాకుః॥౪.

వ॥ ఒక్కపుల్లంగ్రుచ్చిపాఱవై చిస్నానంబుఁజేసి
యుండెనంతనిళయాళ్వారేతెంచిజరిగిన వృత్తాంతం
బుభార్యచేనెఱింగితనకోరికకువిఘ్నంబయ్యెనని శో

కించికాంచీపూర్ణుకడకేగితనభార్యచేసిన యపరాధం
బునుక్షమింపవలయుననిప్రార్థించి వరదునిం గొలుచు
చుండెనంత.

క॥ శ్రీరంగపురనివాసులు। కోరికఁబూర్ణార్యుఁజే
రిగోవిందునిపై। నారయఁగనలిగియిళయా। ళ్వారేగని
చటికిరాకవరదునికడనున్॥

క॥ కావుననీవచటికిఁజని। దేవాయాయనఘునిటకుఁ
దెమ్మనివేడం। గావల్లెయనుచునాతఁడు। శ్రీవరదునిపీ
టికరిగెఁజెందినవేడ్కన్॥

వ॥ ఇళయాళ్వారును దనకు స్వప్నసాక్షాత్కా
రుండయినవరదుండునీకయివచ్చుఁ బెరియనంబినెమ
రొక్కమ్మనియాజ్ఞాపింపముదంబంధియటులఁజేయువాఁ
డైయరుగుచుమధురాంతకంబునఁ గోదండరామస్వా
మిసన్నిధినిఁబూర్ణార్యుం గాంచినమస్కరించినన్నం
బంచసంస్కారసంపన్నుంగావింపుమని వేఁడనతండు
నుగాంచీపురంబున నీకోర్కెందీర్తుననినవిని యిళయా
ళ్వారేమనుచున్నాఁడు.

జంపె.

గురుచంద్రవినుము నేఁగూర్మిఁబల్కెడుమాట। ధర
లోననిదియనిత్యపుశరీరంబు॥ ౧. అరయనిందుకుసాక్షి
యాశివందారుండ। ధరనీకునిటుపల్కఁదగదునిన్నిపు
డె॥ ౨. దయఁజూడుమన్నాతనివాక్యములనువిని।దయ
నటులఁజెప్పియాధరణీసురుండు॥ ౩. సన్నుతింపంగవైష్ణ
వపంకజమ్మునకుఁ। బన్నగాభానుఁడై పరగుమీవసు
చున్॥ ౪. చిరకృపాగరిమెనాశీర్వాదమునొసంగి।వరల
ఁగాంచికినపుడేవచ్చి మోదమునన్॥ ౫. సొరిదిభూమిపి
రాట్టిసుతునిమందిరమునకు। నరుదెంచియిరువురుసుహ
రిపితామహులు॥ ౬. పగిదినిద్దఱకొక్క ప్రాణమోయనఁ
బరగి।ఖగవాహనునిపూజగావించుకొనుచున్॥ ౭. ఇల
జనావలినెల్లనీడేర్చుచునువారు। కలసియుండిరికొంత
కాలమాపురిని॥ ౮.                    వ॥ అంతనిశియాశ్వారు.

క॥అకలంకంబగునన్నము।నొకవిప్రునకొసఁగుమ
నుచునొకదినమునభా।ర్యకుఁజెప్పనన్నముండియు।నక
టాలేదనుచునామెయనృతంబాడెన్॥

వ॥ పిదప నొక్క దినంబున.

క॥ ఇళయాళ్వారుల గృహిణియు। వెలయఁగఁ బూ
ర్ణార్యదేవి పీరలు నూతిం। జలములఁ దెచ్చుటకు నచటిగి। క
లహింపఁగఁ బెరియనంబి కరములిగివడిఁ॥

వ॥ శిష్యుని కెఱింగింపక జాయం దోడ్కొని శ్రీరంగంబునకరిగె నంత నిళయాళ్వారికీ వృత్తాంతంబు నెఱింగి తిరుక్కచ్చినంబి యెఱింగి తాకునొక కాష్ఠంబునం గృచ్ఛ్రపారవైచి స్నానంబు చేయుటయు, శ్రీవైష్ణవునికొక నికింటనన్నంబుండియు లేదనుటయు, గురుభార్యతోఁ గలహించుటయునను మూఁడు భాగవతాపచారంబులఁ జేసిన భార్యతో గృహస్థాశ్రమంబున నుండఁదగదని యామెం బుట్టినింటికని చి వరదునిం జేరి యతనిచేఁ ద్రిదండ సన్న్యాసిత్వంబును శ్రీరామానుజనామంబును జెంది తనాశ్రయించిన దాశరథి కూరాధి నాథాదిశిష్యవరులకు సద్విషయంబుల నుపదేశించుచు సుఖంబుండె నంత.

అర్థచంద్రికలు.

యాదవుని జనని మోదముతోడఁ* యాదవునింగ

నియపుడిట్లనియెన్ *యతిపతిమాహాత్మ్యముగనుఁగొ
నుము*భువిపైఁదగనద్భుతముగ వెలసెన్ * ఆతనిమా
నవుఁడనియెంచకుము*సతతంబును శ్రీపతిపానుపగు*
అహిపతితిలకుండగునితఁడనుచున్ *బాగుగమనుజాలుప
లికెదరవనిన్ * నీవెఱుఁగనియానిగమార్థంబున్ *బా
లుండయ్యునుబరఁగఁగఁదెల్పెన్ * పెనురక్షసుదోలెను
నీవెఱుఁగన్ * శిష్యుఁడవగుమా శ్రీయతిపతికిన్ ॥

సీ॥ అనవినియాదవుండనియెఁదల్లికినిట్లు యతిరాజు
నకు నేఁగృతాపరాధఁ। జెలఁగిభూమిప్రదక్షిణమును గా
వించిశిష్యుఁడయ్యెదయతిశేఖరునకు । ననిపల్కెశయ
నింపనారాత్రివరదుండు స్వప్నంబు ననువచ్చివరలనీ
వు। ప్రాకటంబుగయతిభర్తనువలఁగొనఁబోసఁగనఘ
ముపాయుఁబుత్రనీకు॥ గీ॥ ననుచుఁబల్కెననమ్మినతని
జనని। శ్రీతిరుకచ్చినంబికిఁజెప్పనతఁడు। హరినినడుగం
గనాతండుయాదవుఁగల। నేనుబల్కిన తెఱఁగుననిపుడు
చేయ॥

వ॥ తగునని పల్కిన నతండు యాదవప్రకాశుజనని కెఱింగించె నాయమ పుత్రున కెఱింగించిన నతండిళయాళ్వారులకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరింప నతండీతని కుపనయనాదులను బంచసంస్కారంబును గావించి గోవిందజియ్యరను దాస్యనామంబు నొసంగిన గోవిందజియ్యరు యతిధర్మసముచ్చయంబను గ్రంథంబు నొకటి రచించి కొంతకాలంబు రామానుజుం గొల్చుచుండి పిదపఁ బరమపదంబుం జేరె నంత శ్రీరంగంబున.

అర్ధచంద్రికలు.

పూర్ణార్యాదులు పురుషోత్తమునిన్ * కరమతిభక్తి
నిగని యిట్లనిరి * రంగేశ్వర శ్రీరామానుజుఁడు * యతిపతి
యైయిపుడమరెడిఁ గాంచిన్ * ఎవ్విధినేనియు నిళయా
ళ్వారున్ * పిలుపింపుము హరి పేర్మి నిచటికిన్ * నావినిక
రిగిరినాథుని కపుడే * ఒకయుత్తరమును నొనరఁగ వ్రా
సెన్ * వరదుఁడు శ్రీయతివరు నేవిడిచి * నిమిషముఁ దా
ళఁగనేరననంగన్ * ప్రత్యుత్తరమును బరగఁగ వ్రాసెన్॥

వ॥ అంత శ్రీరంగనాథుండు.

జంపె.

పెరియనంబినిజూచి ప్రియ మొప్పనిట్లనియె। నురులీలనికనొక్క యుపముఁ జెప్పెదను॥ ౧. అరయంగనతులవిద్యావిశారదుఁడైన। యరయదనుబంపుయతివరునిఁదెమ్మనుచుఁ॥ ౨. అడుగవరమునొసంగునరయరుకువరదుండు।తడయకనుగానలోలుఁడు తానుగానఁ॥ ౩. వినుమన్నవినిగానవిద్యావిచక్షణుని। ననఘాత్మునరయరునునప్పుడేపిలిచి॥ ౪. కాంచికినివిచ్చేసికరిరాజ వరదునిం।గాంచి వేగంబెనీగానంబు నెఱపి॥ ౫. వేమారుదంతిగిరివిభుని మెప్పించి శ్రీ।రామానుజునిఁగొనుచురమ్మిటకు వేగ॥ ౬. అనిపలికిపనుపంగనతఁడేగుదెంచి శ్రీ। వనజాక్షుఁడగుఁగంచివరదునింగాంచి॥ ౭. వలగొనిముదమ్ముననువందనంబునొనర్చి। వెలలేనితనగానవిద్యలన్నియును॥ ౮. వినుపింపవరదుండువిస్మయంబందితగఁ।దనలోన మెచ్చియాతనిఁజూచిపలికెఁ॥ ౯. ఘనతతోనిటువంటిగానమెన్నండు నే।విన లేదునీచేతవింటి నేఁడనఘ॥ ౧౦.

వ॥ కాననీవలసినవరంబునిత్తు వేఁడుమనిననతండురా

మానుజునొసంగుమని వేఁడవరదుండుపోయనికుందిపె
రుందేవినైనవిడిచియుండుఁగాని రామానుజువిడువనే
రనైననసత్యంబాడఁదగదని రామానుజుంబనుపనతండు
నరయరుఁగూడిశ్రీరంగంబునకుఁజేరవచ్చుచుండరంగే
శుండుపూర్ణార్యాదులనువిష్వక్సేనాదినిఖిలపరిజనం
బులననుపవారెదురేగియిళయాళ్వారుఁదోడితేరరం
గనాథుండునుద్వారపర్యంతమువేంచేసి రామానుజు
నెదుర్కొననతండునురంగనిపదంబులకెఱఁగి స్వామీ
నాకైయింతదవ్వేతేరందగునేయననతండును నీవునా
కైకంచినుండియింతదవ్వరుగుదేరనేనీకైవచ్చినదెంత
దూరంబనిపల్కి రామానుజుండు వెంబడింపసన్నిధికి
వేంచేసియతనికుడయవరనునామంబొసంగియుభయ
విభూతినాయకుంజేసిపరిజనసహితంబుగమఠంబునక
నుపయతిపతియుఁగూరత్తాళ్వానుచేఁదిరువరంగత్తము
ధనారువంశంబుననుండినసన్నిధిబీగంబునుగ్రహించితి
రువరంగత్తముధనారుసాయించిన ప్రపన్నగాయిత్రి
యగురామానుజనూత్తందాదియనుగ్రంథంబునంగీ

కరుంబిగోవిందభట్టరును సన్మార్గంబునకుఁ దెచ్చుటకై తిరుమలనంబికడకొక శ్రీవైష్ణవుంబనిచి శ్రీరంగరాజచరణాంబుజరాజహంసయనఁదగిసుఖంబుండెనంతంగొన్నిదినంబులకుఁదిరుమలకరిగిన శ్రీవైష్ణవుండే తెంచిరంగేశ్వరదత్తైశ్వర్య విభవాభిరాముండగు యతినాథునకుదండప్రణామంబులాచరించికృతాంజలియై యతనితో నేమనుచున్నాఁడు. జంపె.

వరదేశమిత్ర నేఁదిరుమలకు నేగియటఁ। బరగఁదిరుమలనంబిపదములకెఱఁగి॥౧. కనిమీరు చెప్పినచినక్రమముఁదెలుపంగ । విని యాతఁడప్పుడే విప్రులనుగూడి॥౨.కడుప్రీతితోఁగదలి కాళహస్తిని జేరి। తడయకను నొకకొలనుదరిని గూర్చుండఁగ॥౩. పరగంగగోవిందభట్టరా సమయమున। నరయహరుస్నానమునకై నీరు దేరఁగ॥౪.ఘటము చేధరియించికరము వేగంబుగా।నటరాగఁబల్కె నయ్యనఘుఁడగునంబి॥౫. వెలయనభిషేకమును వేడ్క హరునకుఁ జేయ।ఫలమునీకింతైనఁగలుగునే దానఁగ॥౬.అనియడుగ మాఱుపల్కనుదోఁచకనతండు। చ

నినఁదిరుమలకు మేమునుబోతిమనఘ॥ ౭. తనరంగముటి
యొక్క దినమునను గాళహ। స్తిని జేరివటవృక్షమును
నొకటిఁజేరి॥౮.

వ॥వృక్షంబుక్రిందంగూర్చుండియుండ నంబియుశ్రీ
యాళవందారుస్తోత్రంబున, శ్లో॥స్వాభావికానవధికా
తిశయేశితృత్వం నారాయణత్వయిన మృష్యతివైదికః
కః। బ్రహ్మాశివశ్శతమఖఃపరమస్స్వరాడిత్యేతేపియస్య
మహిమార్ణవవిప్రుషస్తే।అనుశ్లోకంబునువ్రాసిగోవింద
భట్టరువచ్చుమార్గంబుననుంచ నతండును దానింజూచి
తాత్పర్యంబు నెఱింగినంబింజూచి యీసౌమ్యమీయది
గామండునొక్కొయనిననంబియేమనుచున్నాఁడు.

జంపె.

పడదుమా సౌమ్య వినుబదిలంబుగానుండుఁ।బడును
హీనునిసౌమ్యవసుధపైననుచుక్ష॥౧. సదయుఁడై పలు
కంగనదివినియతండనియె। నదియటులనుండనిమ్మనఘ
మీగరయక్ష॥౨.ఒకమార్గమునుబట్టియెప్పాగాభువిఁబో
వు।టకు నేమికతమనినకలంకమయిన॥ ౩.మార్గంబుగా

నననుమహితాత్ములకునరయ। మార్గమకలంక మైమహి
నుండు నెయ్యనన్॥౪. కలిమిచేనుండదుర్గమునంబుభువి
లోనఁ। గలుగునాయనినమీరలుబంధువులను॥౫. విడువఁ
గానిచ్చుటికివేడ్క నేతెంచితిరో। కడువడియనతండు
కడుపులను మేము॥౬. కొనుటకై వచ్చినామనతఁడు నై
ష్టికుల। కునుబశువుపదధూళిఘన మోయుటన్నన్॥౭. త
గినతావునసున్నఁదగునన్నభట్టరును। సొగసుగానడ్డం
బుతగగనిడుపైన॥౮. అది భేదమౌనెతగననినఁదిరుమల
నంబి। పదిలమౌమార్గంబువదలిచరియింపన్॥౯. అదియె
ల్ల భేదమగుననినభట్టరునప్పు। డిదిక్రొత్తగామీరలేర్పా
టుచేయు॥౧౦. కల్లలనవినినంబికరమునీవచనంబు। లె
ల్ల ప్రాచీనమైయిలనుండునరయన్॥౧౧. అనినభట్ట
రుపూర్వమునువిచారింపఁగభు। విని నేలననినసంబియుఁ
బ్రీతితోడన్॥౧౨. పలికెనాతనితోడఁబరతత్వముండుఁ
దగ। నెలమితోసవిచారములవడఁగఁగలదు॥౧౩. అనిప
ల్కమాఱుపల్కనుఁదోచకనతండు। చనినఁదిరుమల
కుమేముసుబోధిమనఘ॥౧౪.

వ॥ అనినవిని రామానుజుండు దాశరథికూరాధినా
థాములంజూచియామునాచార్య శ్రీసూక్తివైభవంబు
నకునుదిరుమలనంబివాక్ప్రౌఢికిని గోవిందభట్టరుమా
టువలుకలేఁడయ్యెఁగంటిరేయనిపలికియాశ్రీవైష్ణవుం
జూచితరువాతివృత్తాంతంబు వినుపింపుమనిననతండు
నుమేముమఱలఁగాళహస్తికేగియొక్కపూలతోపునం
గూర్చుండనంబిత్తిణ్ణెన్విడనుదిరువాయ్మొళికి వ్యాఖ్యా
నముసాయించుచుండఁ బాదిరివృక్షంబునఁబూలంగో
యుచుండినభట్టరుమూఁడుపాశురంబులవినుచుండి తే
వుమెప్పొరుళువును నాలవపాశురంబున। దేవనెంబె
రుమానుక్కల్లాల్ పూవుంపూశనైయుం తనుమే। అ
నవిని తగదుతగదనుచు వృక్షంబునుండి భూమికిఁదిగి
రుద్రాక్షమాలికలఁ దెంచివైచి నంబికి దండప్రణా
మంబులాచరించి బాష్పపూరితలోచనుండు గద్గదకం
ఠుండునై పలుకంజాలక యెట్టకేలకు దుఃఖంబుల సం
స్తంభించికొని నిటలతటఘటితకరపుటుండయి యేమ
నుచున్నాఁడు.

జంపె.

పురుషోత్తమునుభయవిభూతినాయకువిడిచి। వర
లఁగఁబిశాచేశువసతిఁజేరితిని॥౧. సొగసైనసరసిజా
క్షునిఁగొల్వఁగాలేకఁ। బొగకంటివానినేఁబూజజేసి
తిని॥౨. మురవైరిలక్ష్మీశుముదముతోఁగనలేక।గరళకం
ధరునినేఁగామించితినిహా॥౩. గోవర్ధనోద్ధారకునిభ
క్తవత్సలుని।భావింపలేకంగపాలిఁజేరితిని॥౪. అంగజా
కారునేనరసిసేవింపకను। మంగళవిహీనుహరుమహి
నిఁగొల్చితిని॥౫.భర్మాంబరుఁడుగలుగఁబరఁగంగనేనా
గ।చర్మాంబరునిఁజేరిచలదిత్తుఁడైతిన్॥౬.కూటస్థశ్రీ
హరినిబాటించలేకనేఁ। గాటిఁగాచెడునీలకంఠునమ్మి
తిని॥౭. శ్రీపతియనఁబడుతులసీవనముకలుగంగఁ।బా
పాత్ముఁడగుచునిలభవుఁడనెడుమేటి॥౮. పిచ్చిసొరకే
నీరుప్రేమతోఁబోసితిని । మచ్చికనుబ్రోవుమామహి
తాత్మనన్నున్॥౯.

వ॥ అనివిలపించుభట్టరుంగృపాదృష్టింజూచి యం
గీకరించి నంబితిరుమలకు వేంచేసెననిపినియతీంద్రుం

డుమనంబుండెనంతఁ దిరుక్కోట్టియూరినంబికడకుఁ రహ
స్యార్థంబుల గ్రహించఁ బదునెనిమిదిమారులు తిరిగి
యాచార్యుం డొంటరిగా రమ్మనినటులఁ జేయక దా
శరథికూరాధినాథులతోడ నరిగి వారు తనకుఁ ద్రిదం
డపవిత్రంబులని చెప్పి మంత్రార్థంబుల గ్రహించి దీనిం
బరులకుపదేశించిననీకు నరకప్రాప్తియగునని యాచా
ర్యులు చెప్పియు నేనొక్కఁడు నరకంబునంబడినను జే
తను లెల్లరు మోక్షార్హులైనఁ జాలునని యిదివరకుఁ
బూర్వాచార్యులోరాజావళిగా నుపదేశించుచుండిన
గోప్యంబగు రహస్యార్థంబులఁ గొల్లపుచ్చిన నతనియ
భిప్రాయంబు నెఱింగి నతిరుక్కోట్టియూరినంబి వీరెం
బెరుమానారో యనుచుఁ గౌఁగిలించుకొనెఁ గాన నుడ
యవరులకదియొక నామంబయ్యెఁ బిదప యతిపతినంబి
చేమరి కొన్నిరహస్యార్థంబుల గ్రహించి కూరత్తాళ్వా
నును మాసోపవాసంబునిచి నంబియనుమతి నతనికివా
నినుపదేశించి తనకునుపదేశించుమని యడిగిన ముదలి
యాండానుకేమనుచు న్నాఁడు.

సీ॥ గురునాజ్ఞ లేమి నేఁదిరుమంత్రమును నీకుఁ జెప్పని
వాతనిఁ జేరి యడుగు। మనవిని యారీతి నాతండు చేసినఁ
దిరుకొట్టినంబియా ధీరుఁ జూచి । పరగ నంతకు నీవు పా
త్రుండవైన యతీశుం డెమంత్రంబు నిచ్చు ననిన। వినియ
తిపతిఁ జేర వెలయ నాతండును దిరుమంత్రము నొసంగెఁ
గరముఁ బ్రీతి॥ గీ॥ నంతఁ దిరుమాలెయాండాను సమరఁ
జేరి। వెలయఁ దిరుకొట్టియూరి నంబియను మతిని । ద్ర
విడ వేదార్థ మెఱుఁగు చుఁ దనరరంగ। ధాముఁ గొల్చుచు
నుండెను ధరణి పొగడ॥

వ॥ అంత నొకదినంబునఁ దిరుమాలెయాండాను
సాయించిన యర్థంబును వేరువిధంబుగా రామానుజుం
డు దిద్దిన నతండును గాలక్షేపంబు నిలిపియుండఁ దిరు
కొట్టియూరినంబి యొఱింగి నేనాళవందారు కడనీయ
ర్థంబును వింటి రామానుజుండేకలవ్యునివలె నాళవం
దారుల యభిప్రాయంబుల గ్రహించెఁ గాన నెప్పటియ
ట్లుఁ గాలక్షేపంబు నడుపుమనియె నంత నిళయాళ్వా
రు తిరువరంగప్పెరుమాళగయురుచే శ్రీయాళవందా

రుస్తోత్రంబునకర్థంబు నెఱింగియజ్ఞమూర్తియనువాని వాదంబుననోడించి వానికిఁ ద్రిదండసన్యాసిత్వంబును నరుళాళప్పెరుమాళెంబెరుమానారను నామంబు నొసంగిననతండు జ్ఞానసారంబును బ్రమేయసారంబు నన రెండుగ్రంథంబులరచించి రామానుజుం గొలుచుచుండెనంతరామానుజుండు తిరుమలకేగితిరుమలనంబికడ శ్రీరామాయణకాలక్షేపంబుచేసి గోవిందభట్టరుం దోడ్కొని శ్రీరంగంబుఁజేరియతనికిఁద్రిదండసన్యాసిత్వంబును నెంబారను నామంబునొసంగి శ్రీభాష్యంబురచించి శారదచేభాష్యకారనామంబును జెంది శిష్యులవేడికోలున దిగ్విజయంబుచేయుచుఁ గుమతతిమిరంబులందోలంగించి వేంకటాచలపతికిఁ యిడంపురి శంఖంబుతోడతిరువిలచ్చినై స్వరూపంబగుఁ బాంచజన్య సుదర్శనంబులనొసంగి తిరుకుఱుంగుడి నివాసియగు హరిని శిష్యుంజేసికొని యతనికివైష్ణవనంబియను నామంబునొసంగి మరలశ్రీరంగంబుంజేరి జయస్తంభంబునాటి సుఖంబుండెనంత॥

ద్విపద.

ధరణిఁజోళుండనుధరణీశ్వరుండు - పరగునటుల శివాత్పరతరంనాస్తి* యనఁగవ్రాయించితానందఱి చేతఁ-బెనుపొందఁజేవ్రాలుబెట్టించిమఱియు* నరయ నాలూరానుఁడనేడువైష్ణవుని- బరువడివీక్షించిపరగం గనతని*వ్రాలిడుమన్ననావైష్ణవుండనియె-వ్రాలు నేఁబెట్టినవసుమతీనాథ*హరుఁడుపరబ్రహ్మమనిధాత్రి లోన- మరినిజంబగునెనామాటలవినుము * రామాను జుఁడుయతిరాజశేఖరుఁడు - భూమీశశ్రీరంగపురినివ సించు*వరలనాతండుచేవ్రాలుపెట్టినను-ధరనిజంబగు ననితగనతండనిన॥

వ॥చోళుండురామానుజుండెండని తనభటులఁబను పఁగూరేశుండుయతీశుని త్రిదండకాషాయంబులధరిం చితానే రామానుజుండనిపలికిపూర్ణార్య ద్వితీయుం డగుచుఁజోళునికడకరిగి ద్రోణమస్తితతః పరమ్మనిచే వ్రాలుచేసివాదించిననావాదంబుకూరేశ విజయం బనుగ్రంథంబైపరఁగెఁ జోళుండును గూరేశువాదం

బున నోడించ లేక పూర్ణార్యుం జూచి నీయభిప్రాయం
బెట్టిదనిన నతం డేమనుచున్నాఁడు॥

క॥ ఒక్కఁడు కాలిం జాచిన। నొక్కండా కాలిఁ గడి
గె నోరియి లేశా। యొక్కండా జలములఁ దల। ముక్క-
వ ధరియించె నెవఁడు మహీనీశ్వరుఁడో॥

వ॥ అనిన విని చోళుండు కోపోద్దీపితమానసుండై కట
కటంబడి పండ్లు పెట పెటం గొఱికి కనుబొమల త్రువభట
వర్గంబుం జూచి పూర్ణార్యకూరాధిపుల లోచనంబులా
లోచింపకఁ దీయుండనినఁ గూరేశుం డప్పాపాత్ము వీక్షిం
చి యోరి పాపాత్మా నిన్నును పాషండమయంబగు నీ
సభను జూచిన నేత్రంబుల కిదండన తగునని పలికి తానే
తన నేత్రంబులఁ దీసివైచినఁ జోళభటులు పూర్ణార్యు
నేత్రంబులఁ దీసివైచి రంత నద్దేశికోత్తము లిరువురు
ను శ్రీరంగంబునకరుగుచో మార్గంబునం బూర్ణార్యుం
డు పరమపదంబున కేగెఁ గూరేశుండు నురంగపురిఁ జేరె
నంతకుమున్న రామానుజుండు గూరత్తాళ్వాను ధవ
ళాంబరంబుల ధరియించి మేల్నాటి కరుగుచోఁ జోళభ

టులు వెంబడింప నేడుపిడికిళ్లవాన్నజల్లి యేడుపర్వ తంబులంగావించి వారురానీకుండఁజేసి మార్గంబునఁ గొంగపిరాట్టిచే సత్కరింపఁబడి విఠలరాయనికొమా ర్తెనుపోఁకినబ్రహ్మరక్షస్సుందోలి యచట వాదింపవ చ్చినవేవురతోనేకకాలంబున శేషరూపుండై వాదిం చియారాజునుశిష్యునిగానేలి యతనికి విష్ణువర్ధనుఁడ నునామంబునొసంగి॥   జంపె.

తురకలేమనుగూడికరకుడిల్లీపురిని।బరఁగుమాధవు నియమగిరియందుఁజేర్చె॥౧. రామప్రియుండుయతి రాజసంపత్కుమార । నామంబుధరియించె నలిని వేడుక ను॥౨. తనరనాగిరినిద్వాదశవర్షములునిల్చె।దనశిష్యు లనుగూడితగ యతీంద్రుండు॥౩. వెనుకఁజోళుఁడుచ చ్చెననయతీశుండువిని। తనరశ్రీరంగంబుదాఁజేరె వే డ్క॥౪.

వ॥ఇట్లుశ్రీరంగంబుఁజేరిపోష్యశిష్యగురోఃపుత్రః। అనునట్లుసర్వేశ్వరునితోడి చతుర్విధసంబంధంబుగ లిగి సుఖంబుండెనంత॥

జంపె.

మనుజులనుగడతేర్పమహిని డెబ్బదినాల్గు। ఘనుల
విప్రులఁ బ్రీతిఁగరుణనియమించెఁ॥౧. రంగేశ్వరుఁడు
బ్రహ్మారథముఁ జేయించెయతి।పుంగవునను బ్రీతిబుధు
లుల్లసిల్లఁ॥౨.కందాడై యాండానుగరము వేడయతీం
ద్రుఁ। దండమునఁదనవిగ్రహంబుఁదానొసఁగెఁ॥౩.
పరగనిజభక్తులకుఁబరమపదమును బ్రీతిఁ। గరతలామల
కంబుగానుగావించెఁ॥౪. రామానుజుండంతరంగేశు
నసుమతిని। క్షేమించహరిపురిని జేరెసంప్రీతిఁ॥౫.



ద్విపద.

విన్నను జదివిన వెలయనీకృతిని-మన్ననవ్రాసినమ
నుజులువారి*యంతకాలంబుననచ్యుతుఁజేరి - సంతో
షమునలక్ష్మీచను బాలుఁద్రాగి *పరమపదమునందువసి
యింపవచ్చు-నరయరామానుజుయశమును జెల్వు*నీచ
గత్రముతగనీభువిలోన- నాచంద్రతారార్కమై యొ
ప్పఁగాత॥

## గద్య.

ఇది శ్రీమద్రామానుజ సిద్ధాంతనిర్ధారణధూర్వహ శ్రీమదెట్టూరుతిరునిన్నయ్యారద్దంకితిరుమలలక్ష్మీనృసింహకుమార తిరువేంకటతాతాచార్య చరణారవిందసమాశ్రయణ పవిత్రాంతఃకరణధనాలకులకలశాబ్ధిపూర్ణచంద్రభక్తవత్సలనాయక సుపుత్ర దేవరాజనాయకప్రణీతంబైన శ్రీరామానుజవిలాసంబను యక్షగానము సమాప్తము.

---

శ్రీమతేరామానుజాయనమః.



శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీరామాయణసారసంగ్రహము.

కందపద్యము.

శ్రీరామానుజుపదముల। శ్రీరంజిల్లఁగ భజించి
చెందిన వేడ్కన్। శ్రీరామాయణసారము। ధా
రుణి సంగ్రహము గాను దగ రచియింతున్॥

శ్లో॥ పితామహస్యాపి పితామహాయ।
ప్రాచేతసాదేశ ఫలప్రదాయ।
శ్రీభాష్యకారోత్తమ దేశికాయ।
శ్రీశైలపూర్ణాయ నమోనమస్తాత్॥

దేవతలప్రార్థనచేసు పాయంబీశ్వరుండనియు, శ్రీరాముండుదివ్యపురుషదత్తపాయసాన్నమువలనగర్భస్థుండగుటచేఁ జేతనునికి జాయమానకటాక్షము భగవత్ప్రాప్తికిఁబ్రథమకారణంబగుననియు, స్వామితండ్రి

యాజ్ఞ ఋషిని వెంబడించుటచే నాచార్యాజ్ఞ భాగవ
తుల వెంబడింపవలయుననియు, స్వామిని ఋషి నిర్బం
ధముగఁ దోడ్కొనిపోవుటచే భాగవతులు నిర్హేతుకము
గాను నిర్బంధముగాను జేతనులఁ దమదారికిఁ దెత్తురని
యు, ఋషి దుష్టరాక్షససంహారయోగ్యంబులగు ది
వ్యాస్త్రంబులిచ్చుటచే భాగవతులజ్ఞాననాశకంబగు సు
జ్ఞానంబు నొసంగుదురనియు, ఋషియిచ్చిన బాణము
లచే రాక్షసుల శిక్షించి యాగమును రక్షించుటచే భాగ
వతోపదేశము చేత నజ్ఞానము నశించి సుజ్ఞానము కలుగు
ననియు, తపసి కోరిక నెరవేర్చుట సీతాకల్యాణమునకుఁ
గారణమగుటచే భాగవతాభిప్రాయమును వర్తించు
ట పెరియపిరాట్టియార్ కటాక్షమునకుఁ గారణమగు
ననియు, విల్లువిరుచు నెపమున సీతను బరిగ్రహించుటచే
సర్వేశ్వరుండైనైచ్చొన్నాన్ నెన్నూరైచ్చొన్నానె
న్నడియారై నోక్కి నానిత్యాదిరీతిని మడిమాంగా
య్పోట్టు చేతనుల నిర్హేతుకముగ రక్షించుననియు, దశర
థుని దుఃఖనివృత్త్యర్థముగఁ బరశురాముని భంగపరచుట

చేసర్వసముండగునీశ్వరుండు స్వవిరోధులనిగ్రహిం
చుటభాగవతార్థమనియు, రామాభిషేకంబుకై కేయి
ప్రయత్నంబునఁజెడుటచేదుస్సహవాసముచేతసత్కా
ర్యములుచెడుననియుఁ, గైకేయిదుర్బోధనకువశ్యుఁడై
రామాభిషేకవిఘాతముచేసిన దశరథునికిఁ బరమపద
ములేనందునఁబామరజనులదుర్బోధనకువశ్యులై సత్కా
ర్యవిఘాతము చేయువానికిఁ బరమపదములేదనియుఁ,
గైకేయిదుర్బోధనకువశ్యుఁడైనదశరథునిస్వామివిడిచి
పోవుటచేఁబామరుల దుర్బోధనకువశ్యులైనవారినీశ్వ
రుండుపేక్షచేయుననియు, శ్రీరామునియనుష్ఠానముచే
శ్రీయఃపతిదివ్యకల్యాణ గుణములిట్టివనియునిళయపె
రుమాళనుష్ఠానముచేభగవత్కైంకర్యములయందీరీతిన
న్వయింపవలయుననియు, భరతాళ్వాననుష్ఠానముచే
భగవదాజ్ఞాకైంకర్యములయందీరీతినన్వయింపవలెన
నియు, శత్రుఘ్నాళ్వాననుష్ఠానముచేభగవదారాధన
మునకన్నభాగవతారాధనముశ్రేయమనియు, స్వామి
ఋషులకభయమిచ్చి రాక్షసులవధించుటచేసాధుల

కభయమిచ్చి యసాధులశిక్షించుననియు, రావణుఁడు మాయామృగముచేతసీతను మోహింపించుటచేఁబామరజనులుచేతనుల మాయాప్రసంగములచేతఁజెడుదురనియు, మాయామృగమునపేక్షించినసీతస్వామిని దూర ప్రదేశమునకుఁబంపుటచేఁ బామరులమాయాప్రసంగమునకువశ్యులైన వారీశ్వరునిబాత్తిగామరదురనియు, నిశయ పెరుమాళ్ సమృద్ధివిననిసీతరావణునిచేతనపహరింపఁబడుటచే సాధులసమృద్ధివిననివారు చెడుదురనియుఁ, బెరియవుడైయార్ సీతకై ప్రాణమునువిడుచుటచేసాధులు భాగవతార్థమై స్వప్రాణమునుసైతమువిడుతురనియు, స్వామితానే పెరియవుడైయారుకుఁజరమక్రియలుచేయుటచేవైష్ణవోత్పత్తిచింతనముకూడదనియు, శిరియతిరువడిపురుషకారముచేత మర్కటపతియగుసుగ్రీవునేలుటచే భాగవతపురుషకారముచేనీశ్వరుండల్పవస్తువులఁగటాక్షించుననియు, సుగ్రీవవిరోధియగువాలినినిగ్రహించుటచే నీశ్వరుండు స్వాశ్రితవిరోధులనిగ్రహించుననియుఁ, బిరాట్టిలవణ

సముద్రమధ్యమందుండుటచేఁ జేతనులు సంసారార్ణ
వపరివేష్టితులనియు, శిరియతిరువడిచే లవణసముద్ర
మధ్యమందుండుఁ బిరాట్టికి ముద్రయుంగరముఁ బంపు
టచేత నీశ్వరుండు సంసారార్ణవమగ్నులగుఁ జేతనుల
కాచార్యముఖేన పెరియతిరు మంత్రముపదేశించున
నియుఁ, బిరాట్టి శిరోరత్నమిచ్చుటచే నాత్మసమర్పణము
చేయవలయుననియు, శిరియతిరువడి లంకను గాల్చుటచే
సదాచార్యుం డజ్ఞానమును దహించుననియు, శిరియతిరు
వడి సీతావృత్తాంతము స్వామికిఁ దెలుపుటచే నభిముఖు
లైన చేతనుల కాచార్యుఁడు పెరియపెరుమాళ్ సన్నిధి
నీరీతిని బురుషకారము చేయుననియు, సముద్రమునకు
వారధి కట్టుటచే భగవత్కటాక్షము సంసారసాగరము
నకు వారధివంటిదనియు, వానరులచేత గొప్పకార్యముల
ఁ జేయించుటచే నీశ్వరుం డఘటితఘటనాపటిష్ఠుండని
యుఁ, గేవల మూర్ఖుండగు రావణునిచేఁ దామసగుణం
బిట్టిదనియు, నొకప్పుడు విభీషణునికి నొకప్పుడు రావణుని
కి ననుకూలుండగుఁ గుంభకర్ణునిచే రాజసగుణం బిట్టిదని

యు, సదా రావణునికిఁ బ్రతికూలుండగు విభీషణాళ్వా
నుచే సత్త్వగుణం బిట్టిదనియుఁ, గుంభకర్ణ రావణుల విడి
చి విభీషణాళ్వానునను గ్రహించుటచే నీశ్వరుండు రా
జస తామసుల విడిచి సాత్త్వికుల ననుగ్రహించుననియు,
విభీషణాళ్వాను సర్వము త్యజించి తన్నుశరణుచెం
దిన తదనంతరం బంగీకరించుటచేఁ జేతనులు సర్వసం
ఘపరిత్యాగముచేసి తం దైనత్తాయ్ తారం తనయర్
పెరుం శెల్వం యొందనుక్కు— నీయే యతిరాజా। అనుజ్ఞా
నముకుదిరిన వెనుక భగవత్కటాక్షపాత్రులగుదురని
యు, సర్వమును త్యజించి తన్నాశ్రయించిన విభీషణా
ళ్వాను శిరియతిరువడి పురుషకారము చేఁగటాక్షిం
చుటచేత నెంతవిలక్షణునైన సదాచార్యపురుషకార
ము లేక నీశ్వరుండంగీకరించఁడనియు, రావణుఁబుత్రమి
త్రసమేతంబుగ సంహరించుటచేఁ బ్రకృతిసంబంధ
ము నీశ్వరుండు సకార్యముగాఁ దొలగించుననియు, నగ్ని
ప్రవేశానంతరము సీతను బరిగ్రహించుటచే విరజా
స్నానానంతరము ముక్తుల నీశ్వరుండు పరిగ్రహించున

నియు, నగ్నితనచేతులచేతసీతనుస్వామిసన్నిధినివిడు చుటచేతనమానవకరస్పర్శముచేభగవత్సన్నిధిఁజేరవ లయుననియు,స్వామిసీతతోఁగతవృత్తాంతంబులఁబ్రస్తా పించుటచే ముక్తునితోనీశ్వరుండు గతవృత్తాంతంబు లఁబ్రస్తాపించు ననియునిత్యాది శ్రీరామాయణాభి ప్రాయము.

ఇట్టిపరమార్థంబులంగలశ్రీరామాయణంబును శ్రీ యుడయవరులకుపదేశించుటచేఁ బెరియతిరుమలనంబి శ్రీభాష్యకారోత్తమదేశికులైరి.

గద్య.

ఇది శ్రీమద్రామానుజచరణారవిందమకరంద పానపరితుష్టాంతరంగభృంగ ధనాలదేవరాజ నాయకప్రణీతంబయిన శ్రీరామాయణసార సంగ్రహముసమాప్తము.

శ్రీమతేరామానుజాయనమః.